# మడ్డుకత

మంగిపూడి వేంకటశర్మ

మూడవ కూర్పు

౧౯౩౬

వెల ౧—౮—౦.

( భారతినుండి పునర్ముద్రితము )

# ప్రశంసాలేశము



"కులముతక్కువవారు కుమతులు గా
కులముతక్కువవారు కులటలు కారు
* * * *
చదువున కర్థంబు జ్ఞానంబు గాని
చదువైన యక్షరజ్ఞానంబు కాదు;"

[ మడ్డుకత ]

ధర్మాధర్మములను, మంచిచెడుగులను, జాతిమతాచారములనుబట్టి నిర్ణయింప వీలులేదు. కొన్ని జాతి మతాచారము లుత్తమములు, మఱికొన్ని యధమములు నని తలంచుట పొరపాటు. గుణోత్కృష్టములగునవన్నియు నుత్తమము లగును; గుణములులేని యప్పు డెట్టి కులములైనను నీచము లనియే చెప్పకతప్పదు. సత్యధర్మప్రియుఁడగు భగవంతుఁడు జాతిమతాచారములను ప్రేమింపఁడు. అట్లే చదువునకును, జ్ఞానమునకును పరస్పరము సంబంధము లేదు. చదివిన మూర్ఖుని కంటె చదువరికాని జ్ఞాని యెన్నియో మడుంగులు మేలు.

అనశ్వరములగు కీర్తిప్రతిష్ఠలు సత్యధర్మములపై నాధారపడియున్నవి. ఎట్టికుశాగ్రబుద్ధికిని సత్యాన్వేషణ మొనర్చుట చాల దుర్ఘటము. సూక్ష్మాతిసూక్ష్మములగు ధర్మాధర్మముల తత్త్వమును నిర్ణయింపఁ గోరి మన పెద్దలు కొందఱు ప్రాచీనకాలమునందే కొన్ని విషయములగు పరీక్షలను నిర్ణయించినట్లు ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి.

ఇట్టిపరీక్షలు ఎపుడు ప్రారంభింపఁబడినవో చెప్పుట కష్టము. కౌటిలీయార్థశాస్త్రమున ముద్దాయి తాను నిర్దోషియని స్థిరపఱచుటకు సాక్ష్యమును, శపథమును నుపయోగింపవలెనని చెప్పఁబడియున్నది. స్మృతివాఙ్మయమున మీఁదిశపథమునకే కొంతబలము కూర్పఁబడినది. క్రమముగ నీశపథము పరీక్షగ మాఱిపోయినది. యాజ్ఞవల్క్యస్మృతియందు, మితాక్షరమునను ఈ పరీక్షలు దివ్యపదాంకితము లయి యెనిమిదివిధములుగఁ జెప్పఁబడినవి:

౧. తులాదివ్యము: అపరాధి నొకసారి తూఁచి, పిదప మంత్రములను పఠించి మఱల తూఁచవలెను. అప్పుడతఁడు తక్కువతూఁగి నచో నిరపరాధి యగునని నిశ్చయము.

౨. అగ్నిదివ్యము: ఇదివఱకుఁ జెప్పిన రీతిగ నపరాధి నగ్నిపరీక్ష చేయవలెను. అగ్ని వలన నతనికి హానికలుగనిచో నతఁడు నిర్దోషి యగును.

3. జలదివ్యము: జలశపథమురీతినే జల దివ్యమును గ్రహింపవలెను. అపరాధిని జలము తేల్చకపోయినచో నతఁడు నిరపరాధియగును.

౪. విషదివ్యము: అపరాధిచేఁ గొన్ని విషమాత్రలను దినిపింపవలెను. లేదా, యొక కుండలో నేదైనవస్తువును, పామును ఉంచి వస్తువును పైకి తీయవలెనని యతనిఁ గోర వలెను. తినినవిషము వాని కపాయముఁ గలిగింపకున్నను, పాము వానిని కఱవకున్నను అతఁడు నిర్దోషి యగును.

౫. కోశదివ్యము : సమంత్రము గ దేవాభిషిక్తమగు నుదకము మూఁడు దోసిళ్లు లపరాధి త్రాగవలెను. పదునైదురోజులలో రాజకీయమునుగాని, దైవికమునుగాని విపత్తు నాతఁడు పొందకున్న నతఁడు నిర్దోషియగును.

౬. తండులదివ్యము : శుచియగు పరీక్షకుఁడు తెల్లగఁ గడిగిన బియ్యమును సూర్యాభిముఖుఁడై యొక్కమట్టికుండలో స్నానోదకములతోఁగూడఁ బోయవలెను. పిదప అపరాధికి స్నానము చేయించి తలపై నొక ఆకు నుంచి, వానిచే బియ్యము నమలించి వేఱొకయాకుపై (పిప్పలపత్రముపైఁగాని, భూర్జపత్రముపైఁ గాని) ఉమియింపవలెను. అపరాధి మూతి ఎఱ్ఱగఁగాకున్నను, దౌడలు చీరుకొని పోకున్నను అతఁడు నిర్దోషి యగును. ఈ మీఁది దివ్యమును చౌర్య విషయముననే అవలంబింపవలెను.

౭. తప్తమాషకదివ్యము : ఒకమూకుడులోఁ జమురుపోసి సలసలఁ గ్రాఁగనిచ్చి యందు నాణెములనుగాని, బటువునుగాని

పడవేయవలెను. అపరాధి తనచేతిని పూర్తిగ నాచమురులో ముంచి వస్తువును బయటికిఁ దీయవలెను. అప్పుడతనిచేయి కాలక—పొక్కు పోకయున్నచో నతఁడు నిర్దోషి యగును.

౮. ధర్మాధర్మదివ్యము: ఒకవస్తువునకు ధర్మమనియు, వేఱొకదానికధర్మమనియుఁ బేర్లు మనసున నునుకొని పరీక్షకుఁడు పరీక్షి తుని, ఏదైన ఒకదానిని స్పృశింపఁగోరవలెను. అపరాధి ధర్మసంజ్ఞకమును ముట్టినచో నిర్దోషి యగును.

ఫాలదివ్యము మొదలగునవి మఱికొన్ని యిట్లే కలవు.

విషయముయొక్కయు, కాలముయొక్కయు భేదమును, తారతమ్యమును బట్టి యీ పరీక్షలు మాఱుచుండును. ఇయ్యవి స్త్రీపురుష సాధారణములే యైనను, సామాన్యముగ స్త్రీల విషయమునందే యుపయోగింపఁబడు చున్నట్లు తెలియుచున్నది. ఈ పరీక్ష లిప్పటి కిని మనదేశమునఁ గొన్నికొన్ని స్థలములయం దాచారమున నున్నవి.

ఖండాంతరముల సంగతి యెటులున్నను భరతఖండమునమాత్రము సత్యము, పాతివ్రత్యము మొదలగు నుత్తమధర్మములకుఁ దగినప్రాధాన్యము కలదు. భార్యకు భర్తయే దైవము. పతి యెంతకఠినహృదయుఁడైనను, తన్ను బాధించుచున్నను భారతరమణీమణి యతనియాజ్ఞ నుల్లంఘింపదు. సర్వదా అతనిని మెప్పించుటకే ప్రయత్నించును. అట్లే భర్తయుఁ దనభార్యను శరీరమునందలి సగపాలుగఁ దలంచును. "జంపతి - దంపతి" అను పదములందుఁగూడ ధ్వనితమగు మీఁది తత్త్వము గోచరించుచున్నది. పతివ్రతలగు వనితలు తమ పాతివ్రత్యమును నిర్ణయించుకొనుట కెట్టికఠినపరీక్షలకైనను వెనుదీయరు. వేయేల? పరమపతివ్రతామతల్లియగు సీతాదేవియే మండునిప్పులో నుఱికినదిగదా!

జాతిమతాచారములతో సంబంధములేని యిట్టియుత్తమధర్మము నొక యథార్థచరిత్రముతో మేళవించి శ్రీమంగిపూడి వేంకటశర్మగారు "మడ్డుకత" యను నీచిన్నిగ్రంథ

ము నాంధ్రలోకమున కర్పించుచున్నారు. ఒక
యెఱుకపడుచు తనసతీత్వమును బ్రకటింపఁ
దలఁచి యిదివఱకుఁ జెప్పఁబడిన విషమపరీక్ష
లలో నొకటియగు "తప్తమాషకదివ్యము"నకు
గురియై కృతార్థయైనయంశ మిందు వర్ణితము.

ఒకయెఱుకని కిరువురుభార్యలు. వానికిఁ
జిన్నభార్యయెడ మక్కువ యెక్కువ. ఒకప్పు
డామె యెఱుకచెప్పుటకు వాడవాడలఁ దిరుగు
సమయమున పెద్దయాపె సవతియగునామెపై
లేనిపోని కొండెములు కల్పించి యామెసతీ
త్వమునకుఁ గళంకము కల్గించి మగనితోఁ
జెప్పి యతనిని నమ్మించినది. అతఁడు వానిని
నమ్మి చిన్నదానిని దిట్టరానితిట్లు తిట్టెను.
ఏపాపము నెఱుంగని యాసతీమణి తనసతీత్వ
మును సమర్థించుకొనఁ దప్తమాషకపరీక్ష
నిచ్చి జయము పొంది మగనిమన్ననకుఁ
బాత్రమైనది. ఇదియే యిందలి కథాభాగము.
కథ చిన్నది; కాని యిందువలన లోకము
నేర్వఁదగిన నీతిమాత్రము మిక్కిలి పెద్దది.

కావ్యమునకు రసము ప్రధానము. కవిత యన్ని విధముల రసాభివ్యంజకమై యుండ వలెను. ఇందలి సవతులపోరు, సంధ్యాకాలము, రాత్రి, చీఁకటి మొదలగువాని వర్ణనములు, నుడికారముసొంపు రసమున కత్యంతము ననుకూలములు.

ఇందు ఎఱుకసాని సత్యపరాక్రమమును వ్యక్తపఱచినందున నిది ధర్మవీరప్రధానక మగుచున్నది. వీరగాథలు సామాన్యముగ ద్విపదలు, వానితోడి దగ్గఱిబాంధవ్యముగల పదములు మొదలగు ఛందములలో రచింపఁ బడిననే రసావహము లగును. "పల్నాటివీర చరిత్రము", "బొబ్బిలియుద్ధము" మొదలగు వీరగాథ లట్లే కూర్పఁబడియున్నవి. కావున నీకథారచనము మంజరీద్విపదయందుఁ జేయఁ బడుట యెంతయు సమంజసము.

ఆంధ్రదేశమునకుఁ జిరపరిచితులగు శ్రీ శర్మగారి రచనాచాతురిని పేర్కొనుట చర్వితచర్వణము. లలితలలితమగురీతుల జాను తెలుఁగునఁ గబ్బములు వ్రాయువారిలో వీ రగ్రగణ్యులు.

"ఓసోసి వగలాడి! యో వాడవదినె"
"బయలెక్కెఁబో నీదు బాజారమెల్ల"
"మననేస్తమును జూచి మనమన్కిచూచి
కన్నుగుట్టిన చెడ్డకామిని యెవతో"
"ఏమనికూసితివే యోసిబసివి!"
"మగఁడును నీవు మమైకమ్ము చెంద"
"ఓసిగరాస! ఓసోసి పిసాళి!"
"ఈలాటి సూడు నీ కేలనే సవతి!"

ఇట్టి జాతీయ ప్రయోగములతో నీ చిన్ని కావ్యము నిండియున్నది.

మఱియు నీ రేకావ్యమును రచించినను నీతిని ముఖ్యముగఁ బాటింతురు. ఇందలి సతీ ధర్మోపదేశ మమూల్యము. ఇట్టి నీతిజాతీయ తల మేళవింపు మనకు వీరి "బాలవితంతువిలాపము", "నిరుద్ధభారతము" మొదలగు కావ్యములయందును గాననగును. ఈ మడ్డుకతయం దచ్చటచ్చట "ఓసోసి, ఎవతో, ఎంతున్న, గతేమానో, మున్నగు వ్యాకరణాసాధ్యములగు ప్రయోగములు కానవచ్చుచున్నను,

రసతన్మయులగు కవి, సహృదయుల కవి నెఱసులని తోఁచదు. రసాభివ్యక్తి కడ్డంకులగు ప్రయోగములే దుష్టములని సహృదయుల యాశయము. రసతన్మయులగు కవు లచ్చటచ్చట వ్యాకరణశృంఖలలఁ ద్రెంచుకొని స్వేచ్ఛావిహార మొనర్చుట వాఙ్మయప్రపంచమునఁ గలదు.

ఆంధ్రమున కన్ని విషయములందునుఁ బ్రత్యేకత కలుగవలెనను వాంఛ యిప్పుడిప్పుడే యాంధ్రులహృదయభూమి నంకురించుచున్నది. అనేకులగు విద్వాంసు లీవిషయమున నుపన్యాసము లిచ్చుచున్నారు; కాని యవి క్రియారూపముఁ దాల్చుట యరుదుగ నున్నది. అట్టి ప్రత్యేకతాభిమానులు రచించు గ్రంథములు కూడ సంస్కృతపదభూయిష్ఠములై ప్రత్యయమాత్రప్రత్యేకతనే యాంధ్రమునకు గూర్చుచున్నవి. తెలుఁగుబాసకు సంపూర్ణముగఁ బ్రత్యేకత కలుగవలెనన్న "ముద్దుకత" వంటి గ్రంథములు- సర్వజనవేద్యములు, భావవిలసితములు, లలితాంధ్రపదగుంభితములు-

ఎన్నియేని కావలసియున్నవి. సహృదయులు, పండితులు నగు నాంధ్రు లిట్టి గ్రంథములను రచించి భాషకు వన్నెగూర్చుటకై సర్వవిధ ముల సత్వరముగఁ బ్రయత్న మొనరించుట ఆవశ్యకము.

ఈ మద్దుకత సదుపదేశకము; నీతిదాయ కము; ఉత్సాహాభివర్ధకము; భావవిలసితము; ముఖ్యముగ సలలితాంధ్రపదగ్రథితము. దీనిని పఠించినచోఁ బలువిధములగు మనోభావము లుద్రిక్తములై కార్యసాధనమునఁ బట్టుదలను, అంతకంటె నెక్కువగ తేనియలొల్కు తెనుఁ గునుడికారపుసొంపును గుర్తించుటలో మిగుల బీదవడియున్న నేటి విద్యార్థుల యాంధ్రభాషా జ్ఞానసంపదను వృద్ధిపఱుపఁగలవు. కావున నీ గ్రంథము స్కూలుఫైనలుతరగతికి అవశ్య పఠనీయ గ్రంథముగ నిర్ణయింపఁబడవలసి యున్నది.

శ్రీ శర్మగారు ఇట్టిగ్రంథములఁ బెక్కింటిని రచించి పలువురకు మార్గదర్శకులై సంస్కృత

వాఙ్మయభూయిష్ఠమై నామమాత్రముగ మిగిలి యున్న ఆంధ్రవాఙ్మయమునకు జీవమును, జవమును సమకూర్చి ప్రత్యేకతను సంపాదింతురుగాక !

బులుసు వేంకటరమణయ్య,
సాహిత్యవిద్యా-ఉభయభాషా-ప్రవీణ.

— —

# తొలిపలుకు

తెనుగువాఙ్మయ మించుమించుగ నేటిబీరకాయను బోలియున్నది. అది యాపేరున చెల్లుబడియగుచున్న సంస్కృతము. కరకుచేద్రాడులవలె కడు నిడుద లగు గడుసుసమాసముల నిలిచిన 'అసలు' రూపమునను 'డుముువులు' మొదలగు కుళ్లాయీలను దగిలించుకొనిన 'నకలు' రూపమునను, అస్థిసార మడు గంట ఎండు వారిన వికృతరూపమునను సంస్కృతము తెలుగువాఙ్మయము నాక్రమించుకొనినది. ఈసంస్కృతము 'మినహా' పెట్టగా నిలిచిన తెనుగు కొంత అంట రానిదయినది. మిగిలినదానినిమాత్రమే వాఙ్మయ మంగీకరించినది. అదియే తెనుగుదేశపు తెనుగు ; తెనుగువారి తెనుగు : జానయిన దేశి తెనుగు. అట్టి తెనుగున రచియింప బడిన వాఙ్మయమునకే తెనుగువాఙ్మయ మనుపేరు చెల్లదగును. అట్టిది మృగ్యమయినది.

ఇతరదేశభాషలయందును సంస్కృతమునకు ప్రవేశము కలదు. అది పరిమితము ; సముచితము. దాని వలన నవి చవులు మించినవి. తెనుగున నట్లుకాదు. సంస్కృతె మపరిమితముగ పైకొనినది ; దానిని తెవులు వలె నీరసింపజేసినది. చివరకు సంస్కృతమును ప్రత్యేక ముగ జదివినగాని తెనుగువాఙ్మయ మర్థముకాని స్థితికి

వచ్చి నిలిచినది. ఇట్టిదుర్గతి యిక నేదేశభాషకును పట్టినది కాదు.

పండ్రెండవశతాబ్దివాడగు పాలకురికిసోమనాధు డొక్కడు 'ఆరూఢగద్యపద్యాదిప్రబంధ పూరిత సంస్కృతభూయిష్ఠరచన', 'జానుదెనుగు' రచన అని తెనుగురచనను రెండుగా వింగడించినాడు. అందు మొదటిదానిని 'సర్వసామాన్యంబు' కాదని నిరసించినాడు; రెండవదానిని 'ప్రసన్నతకు విశేష' మని బహుమానించినాడు; ఆజానుదెనుగునుడికారములకూరుపున తెనుగుకవితకు సొంపును సవదరించి తెనుగుకవి యనిపించుకొనినాడు. ఆతనికి మున్నుండినవారుకాని, వెనుకనుండినవారుకాని తెనుగుతీయదనమునుగుర్తించినవారు కారు. కావుననే తమకావ్యములయందు జాను దెనుగున కెక్కుడుగ తావు నీయరయిరి.

'దేశభాషలందు తెనుగు లెస్స' యని గొంతెత్తిచెప్పిన రసికవతంసము సయితము తాను రచియించిన ఆముక్తమాల్యదను సంస్కృతమయము కావించినాడు. తెనుగువాఙ్మయ మెంత విస్తరిల్లిననేమి? అదియంతయు సంస్కృతమే యయిపోయినది! అందు తెనుగుదనము చాల సన్నగిలిపోయినది. పొరుగింటిపుల్లగూరరుచి కబ్బురపడు తెనుగువారిదగు తెలివి తక్కువయే దీనికి కారణము.

పండ్రెండవశతాబ్దినాటి పాలకురికి సోమనాధునికి తరువాత, నాతనివలె జానుదెనుగుప్రసన్నతను తెలిసిన యొక తెనుగుకవి మరల నీయిరువదవ శతాబ్దిని

తెనుగుమాగాణమున వెలసినాడు. ఆయన తెలుగువారికి బెస్సగా పరిచితు డయిన కవి శ్రీ మంగిపూడి వేంకటశర్మ. జానుదెనుగు నుడికారములతో తెనుగు కవిత కందమును గూరిచి తెనుగుదనము నమరిచిన నేరుపరి ఆయన. ఆయనకవితాలత పెక్కు పూవులను పూచి తావులను కొల్లలుగ విరజిమ్మినది. 'మద్దుపెత' అతీవను బుట్టిన క్రొత్తపూవు. దాని కమ్మని తెనుగువాసనలను భారతి తెనుగువారికి పంచి యిడినది. దిద్ది తీరిచిన పొంకమున నందలి జానుతెనుగు దేశపదముల కూరుపు చదువరుల నోటలూరించును; ఉప్పొంగజేయును. కథావస్తువును ఒక్కయొత్తుననడపించుచు అందలి పాత్రలను కన్నులయెదుట మెలగజేయగల శక్తి యీయనకవితకు గలదు. ఈయనకవితాధార ఎంత సరళమో అంతమధురముగ నుండును. 'కవులు నిరంకుశులు' అనునుడిని సార్థకము చేయగలిగిన సరసపద ప్రయోగకుశలు డీకవి. తెనుగునాటికి, తెనుగుతల్లికి, తెనుగుకవితకు, కొంచెపడిపోయిన తేజము మించజేసిన యీ తెనుగుకవి తెనుగువారలకు కడుంగడు మాననీయుడు.

తెనుగును సంస్కృతమునుండి విడదీయవలసినదని ఈ నాడు తెనుగువారు పట్టుదలతో కోరుచున్నారు. కోరదగిన, కోరవలసిన కోరిక అది. కాని తెనుగు జాడతప్పినతెనుపదములపాటును వడిగా చక్కదీసికొని ఒంటిమెయి నిలువజాలినగాని సంస్కృతము చుట్టరికమునుండి విడివడజాలదు. ఈ గుట్టును

మనమున బెట్టుకొని నేటికవికుమారులు వేంకటశర్మకవి వలెనే తెనుగుదనములో నొప్పులొలుకు తెనుగుపుస్తకములను రచియించి తెనుగుతల్లి నలంకరించి యామె 'బానిసతనమును' రూపుమాపవలెను: ఆమె దీవనలనుగనవలెను. ఇందుకు కొందరు కవికుమారులు కంకణముకట్టియున్నారు; తెనుగుతల్లిని తెనుగుత్రోవల నడపించుచున్నారు. కొలదియేండ్లలోనే ఆమెకు ప్రాభవము చేకూరగలదు.

తెనుగు విశ్వకళాపరిషత్తు ఈ కవికుమారులకు చేయూత యిచ్చి తెనుగుతల్లిని పెంపొంద జేయకున్న దానిపుట్టువు వ్యర్థము.

'మడ్డుకత' స్కూలు ఫైనల్ తరగతివారునియమముగా చదువతగినది. అట్టిఅవకాశము దానికి కలుగక పోవునేని అది పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారికి తెనుగుపైగలప్రీతికి, వారి అరసికతకు మాయని నిదర్శనము కాగలదు.

చెన్నపురి.
౭-౧-౩౪.
} గన్నవరపు సుబ్బరామయ్య.

---

# మద్దుకత

---

ఎఱుకమ్మ యెఱుకోయి యెఱుక యటంచు,
సోదమ్మ సోదోయి సోది సోదనుచు,
ఎవ్వారు నెన్నఁడు నెఱుఁగనియట్లు,
జరిగిన వెల్ల పూసలు గ్రుచ్చినట్లు,
బిరబిర నొక్కటైన బీరుపోకుండ,
తారాడ్యాణాగా సోదె తాఁ జెప్పె సహహా!
ఏను లారఁగ విన్న విషయంబులైన
కనులారఁ గన్న సంగతులైనఁ గాని
వదలిపెట్టకయుండ వాక్రొనలేము.
ఇంత లేఁబ్రాయమందే యీలతాంగి
కేభంగి నబ్బెనో యీమహామహిమ!
ఏలీల నేర్చెనో యీదొడ్డవిద్య!
వనిత శాంబర ముపాసన చేసెనేమొ!
ఈయింతికడ నున్నదో యెట్టిమారి!
కాకున్న నిది దేవకాంత కావలయు,
కాదేని నీశక్తి కలుగు నేలాగు?

అని విన్న కన్న వా రబ్బురంపడఁగ
ఇల్లిల్లు తిరుగాడి మెతుకలు చెప్పి
ఇల్లాండ్ర మెప్పించి మెలమి నొందించి
రూకలు బియ్యంబు జోకలైనట్టి
కోకలు రైకలుం గొని, మోద మడర,
ఎలఁబ్రాయమున నున్న మెతుకతె యొకతె
నెలవున కరుదెంచి నెమ్మి మీఱంగ
తనబుట్ట దింపి యల్లన గూరుచుండి
సొరిదిఁ దాఁ దెచ్చినసొమ్ముల నెల్ల
మగనిముందరఁ బెట్టి మక్కువతోడ
సరసను గూర్చుండె సంతోష మలర.
అందాఁక నతనితో నరమరల్ లేక
మంతనా లాడెడు మగువ యొకర్తు
అట కామె రాఁగానె చటుకున లేచి,
పని యేమొ యున్నట్లు ప్రక్కనే యున్న
తరువుచాటున పొంచి పరికించుచుండె.
ఆతఁ డావస్తువు లరయుటల్ మాని
చిరచిరలాడుచు చిర్రుబుర్రనుచు
చురచుర కోపానఁ జూచుచు లేచి,
'ఓసి మాయలమారి, మోదోసకారి,

మ ద్దు క త

ఓసోసి వగలాఁడి, యోవాడవదినె,
తెలిసెను పో నీదు తలఁపు ల వెల్ల,
పొడగంటి పో నీదునడవడు లెల్ల,
బయలెక్కెఁ బో నీదు బాజార మెల్ల,
వరదబోయెన నీదుబాస లవ్వెల్ల,
మతకమ్ములే నీదు మచ్చిక లెల్ల,
మన్నయ్యెనే నాదు మన్నన లెల్ల,
నమ్మయ్యెనే నాదు నమ్మిక లెల్ల,
పాలివోయెనే నాదు పోరామి యెల్ల ;
అకట! యింతటిదాన వని నేరనైతి;
అయ్యయో, నిను నమ్మి అగడు నొందితిని;
నినుఁ గట్టుకొని చాల నీచుఁడ నైతి;
కులమువారల కెల్ల పలుచ నైపోతి;
నాసాటివారెల్ల నవ్వఁ బాలైతి;
నాదుపెద్దలపేరు నలుపుచేసితిని ;
ఓసి గయ్యాళి, ని న్నొల్ల నే నింక:
నీమిండఁ డున్నట్టినెలవున కరిగి,
కొంకు జంకును నరగొర లేనియట్టి
భోగాలు పొందంగఁ బొమ్ము, పోపొమ్ము.'
అని యిట్లు దుర్భాష లాడ నాలించి

## ముద్దుకోర

గరితల తలమానికంబై వెలుంగు
చిన్ని యీరాయెఱుకత చెవులలోపలను
కదురు లెత్తగఁ గాల్చి కట్టగాఁ బట్టి
గట్టిగా గ్రుచ్చిన కైవడిన్ నొచ్చి
నిలువు నీరైపోయి, వెలవెల్లబోయి,
వెఱ నొంది కంది నివ్వెఱ నొంది కుంది,
'అయ్యో, దైవమ యిదే మన్యాయ మయ్యా,
నన్నుమూసించె నాచెల్వుఁ డిప్పుడు!
ఓ ప్రొద్దుదేవరా, ఓ వేఁడివెలుఁగ,
వేయిచేతులతోడ వెలుఁగొందువాఁడ,
జగముకన్నగువాఁడ, చాయమ్మమగఁడ,
జనులచైదములెల్లఁ గనుఁగొనువాఁడ,
ఎఱుఁగవే నీవు నాయీలువుతనము?
ఓతల్లి బూదేవి, ఓకిమినెలవ,
ఓసంపదలగనీ, ఓపంటవలఁతి,
ఓతేగములకొట్ట, ఓతాల్మితిట్ట,
నీచల్వచేఁ గదా నిలుచును జగము?
దమ్ముల కెల్ల నాదరువైన యమ్మ,
తెలియదే నీకు నాతలఁపుచందంబు?
సాకివై నను నీవు సాఁక రావమ్మ!

మాతల్లి, యాకసమా, యెల్లయెడల
నిండియుందువు గదా నీవు జగాన ?
ఓగాలిదేవరా, ఓతండ్రికాన,
నీవు తారాడని నెలవులు గలవె ?
తెలియ లేరే నాదు పొలఁకువ లెల్ల
నేఁ డిదేమో చెడ్డ నింకె వాటిల్లె;
నామనుగడ నంటె నల్లనిమచ్చ;
మొదల నామనువుకే మోసంబు వచ్చె:
మానంబు చచ్చె, నెమ్మది నొచ్చి విచ్చె;
పాన మిం కేటికి, బ్రతు కేటి కింక ?
పలుకరే మీరు నాతలఁపుచందంబు,
నుడువరే మీరు నా నడవడితీరు,
చెప్పరే మీరు నా చెయిదాల సరణి,
చూపరే మీరు నా సుద్దంపు గొనము,
కాపాడరే మీరు కనికారముసను,
తీర్పరే నానేస్తు తీరనియలుక,
మాన్పరే నాచెల్వు మదిలోని కొంకు,
నిలుపరే మీరు నా నిండుకాఁపురము ?
నే నోర్వరాని యీా నిప్పచ్చ నిందె
విదళించి నను నేఁడు బ్రదికింపరయ్య !'

అని దేవతలకెల్ల అంజలి పట్టి
భక్తితో ప్రార్థించి భర్తను డాసి
కరములు జోడించి కాళ్ళపై వాలి
కన్నుదమ్ముల నీరు కాల్వలై పార
కంపించు మేనితో గద్గదస్వరము
గదుర నేడిచె జాలిఁ గదిరి రాల్గరఁగ:
'నాసామి, యెఱుఁగవే నాయెదతీరు;
నారాజ, తెలియవే నానడవడిక;
ఎవ్వారు పుట్టించి రీ రోఁతమాట?
ఎవ్వారు కల్పించి రీలాటి దూఱు?
చెనఁటు లెవ్వారైన చెప్పిరే? చూడు,
నమ్మకె ట్లయ్యెనే నాజోడ, నీకు?
నాపాపమున నేఁడు నాయందు నీకు
అటువంటియనుమాన మయ్యెనే గాని,
ఏకళంకైనను నెనసెనే నన్ను?
నిన్ను దైవంబుగా నేఁ గొల్చుచుంటిఁ
గాని నే కలనైనఁ గాని యెన్నఁడును
కన్నార పెరవానిఁ గనియైన నెఱుఁగ;
వెలిచవుల్ తలఁపులోఁ దలఁచు టే నెఱుఁగ
మన మక్కువలు చూచి, మనచెల్మి చూచి,

మడ్డుకల

మన నేస్తమును జూచి, మనమనిక్కఁ చూచి,
కన్ను గుట్టిన చెడ్డకామిని యెవతో,
సూడు గైకొన్నట్టి చుప్పనా తెవతో
నీలివార్తల నల్లి నిందెలు పన్ని
కల్లలు నిజములు గాఁగ నమ్మించి,
బుద్దులు మళ్లింపఁ బోలును నీకు.

ఏగట్టివాయి నీ కీబోధఁ జేసె?
ఏ నీచురాలు నీ కీ బుద్ధి గఱపె?
ఆజంత యిటు వచ్చి అందఱుఁ జూడ
నేను చేసినయట్టి నెప మిట్టి దనుచు
నుడుగక నామ్రోల నుడుగంగ రాదె?
చాటున మాటున చాడీలు చెప్పి
కొంపలు గూల్చుట గొప్పతనంబె?
ఇట్టిపాపము నొడిగట్టుకొన్నట్టి
దాఁగ తా ముందుకు రాఁగల్గునొక్కొ?'

అని గట్టిగా పల్కు నాపల్కు లెల్ల
ములుకులవలె నాటి కలుకుమనంగ
అలుఁగు నాటిన పులివలె చెట్టువెనుక
నొదిగి కన్గొనెడు నమ్మదవతి కినిసి

## ముద్దు కత

చ్రున నివలికి చనుదెంచి నిలిచి,
‘ఏమని ప్రేలితివే యోసి తులువ?
ఏమని కూసితివే యోసి బసివి?
ఏమని వాగితివే యోసి చెడిపె?
నే గట్టివాయినా, మూఁగవా నీవు?
నే నీచురాలనా, నీ గొప్పతనము
ముందు? నే జంతనా, ముగుదవా నీవు?
మగనికి తనమీఁద మక్కు వెంతున్న,
పెనిమిటి త న్నెంత ప్రేముడిన్ గన్న,
పురుషుఁ డెంతటి గారవమును చేయుచున్న,
తలునికి కన్నులు తలకెక్కరాదు;
ఎదిరి నెన్నఁడు నీసడింపఁగారాదు;
ఎరుసున చూడరా దెవరినేఁ గాని;
ఉల్లసంబాడరా దొరుల నెవ్వరిని:
నీయంతదానవు నీవు, నాయంత
దానను నేను గదా! నేను వినఁగ
వంకడొంకలు పెట్టి పదిమందిలోన
నూరకే నిందించు టొప్పునే నీకు?
మగఁడు నీవును గూడి సుగము లొందంగ,
నే నోర్వ లేకుంటినే నీచురాల?

## ముద్దుకత

మగఁడును నీవు మమైకమ్ము నొంద,
నే చూడ లేకుంటినే చుప్పనాతి ?
మగఁడు ని న్నెప్పుడు హెచ్చుగ బుజ్జగింప
నే సైఁప లేకుంటినే నంగనాచి ?
మగఁడు నీమాటలో మసలువాఁ డనుచు,
మగఁడు నీమాయలోఁ దగిలినాఁ డనుచు,
మగఁడు నిన్నే చాల మరిగినాఁ డనుచు
ఇంతగా త్రుళ్లింత లేలనే సవతి ?
మగవారిమక్కువల్, మగవారిచెలిమి,
మగవారివగలు నమ్మఁగరాదు సుమ్మ !
పడుచుఁదనంబు లెప్పుడు నిల్వఁబోవు;
చక్కఁదనమ్ములో సతములు గావు;
అవి రెండు పోయినయవల పూఁబోండ్ల
వగలు నొద్దికలు గవ్వకు చెల్లఁబోవు;
తనివి బాలలఁ గన్నతల్లి యౌఁదాఁక
మగవారు లాలించి మాటలాడుదురు;
సకుల మైజిగిబిగి సడలెడుదాఁక
పురుషు లనుసరించి బుజ్జగించెదరు ;
నేఁటిబోగాలెల్ల నిత్తెముల్ గావు ;
నేఁటిసుకమ్ములు నిత్తెముల్ గావు ;

మడ్డుకత

నేఁటిసంతోసాలు నిత్తెముల్ గావు;
నేఁటినెయ్యాముల్లు న్నిత్తెముల్ గావు.
వనిత తా నెంతటి వగలాఁడియైన,
మగువ తా నెంతటి సొగసుకత్తైన,
చాన తా నెంతటి చదురురాలైన,
మడఁతి తా నెంతటి మాటకారైన,
మిడిసి రాలఁగ రాదు మిను మన్ను మఱచి:
తనబాగ్గ మేతీరు తారుమారవునొ,
తన కెన్నఁ డేగతి దాపురంబవునొ,
తరమౌనె తెలియంగ నరుల కింతైన?
ఓసి గరాస, ఓసోసి పిసాళి!
పోతరంబున మించి పొంగెద వేలె?
నీపొంగుపాటెల్ల నేలలోఁ గలియు.
ఏటికే నీ కింతయీసు నామీఁద?
ఏటికే నామీఁద నింత మచ్చరము?
ఈలాటి సూడు నీ కేటికే సవతి?
ఏయన్నమును పున్నె మెఱుఁగనియట్టి
న న్నాడిపోసిన నాలుక చెడదె?
మగవాఁడు మెత్తనిమదివాఁడు గాన
పొగ రెక్కి యీలాగు తెగి వీదిలోన

## మద్దుకత

తెగసాఁగెదవు గాని, మగనాఁడు సుంత
తెగువరి యైన నీపగిది వాగుదువె?
నాకు దారము గట్టి నన్ను ప్రేముడిని
లాలించి పాలించి బాలలఁ గాంచి,
వలపులో బులుపులో వాలలాడించి,
నాముద్దు చెల్లించి, నన్ను మన్నించి,
నాతోడినీడయై ననుఁ బాయలేక,
నాతోడిలోక మైనట్టి నామగని
మందుమాఁకులు పెట్టి మరులు పుట్టించి
తగులుకు వచ్చి నాసుగము హరించి
కులుకుటే గాక, నల్లురిలోను బట్టి
ఉత్తినే తిట్టేవు జిత్తులమారి,
మగవాని మరియాద మంటలోఁ బెట్టి,
మగవాఁడు సిగ్గుచే మ్రాన్పడి చూడ,
చాగురే! బోగముచానచందాన
కారుకూఁతలు పాటగాఁ బాడుకొనుచు,
చేతులు తిప్పుచు తైతక్కలాడ
తగవరు లెవరేని నగిపోరె సవతి!
ఇంతయాగడము నీ కేటికే సవతి!
ఈమిట్టిపాటు నీ కెన్నాళ్లె సవతి!

## మడ్డుకత

ఈతుళ్లు తెళ్లు కాసీలేవె సవతి !’
అని యీసడించుచు సదరిపాటునను
మేఁకపై బెబ్బులి జోకమై దూఁకు
టీకుస మై పెంచి, లోకులు బెదర,
మిత్తిరూపున మీఁదిమీఁదికి వచ్చి
బుగ్గలు పొడుచుచు పగ్గలాడుచును
గగ్గోలుచేయు నక్కామినిం జూచి,
ఆచిన్నియెఱుకత లేచి నిల్చుండి,
‘చూచితిరే, మీరు చూచితి రయ్య,
లోకులారా, నాడె లోటుపా టున్న
ముచ్చెలు గొని నన్ను మోఁదింపరయ్య !
మొదలుగా విన్నావు గదర నాజోడ,
ముదలచేయుము నేరమును నేరుపఱచి ;
నీ కడ్డ మున్నదే లోకమ్మునందు ?
మమ్ము నెమ్మిని పెంప మందలింపఁగను,
తిట్టంగ కొట్టంగ తెంపున చంప
నాయ మున్నది నీకు నాయేలువాఁడ !
త న్నేమి యంటి, నా తప్పేమి గంటి ?
అది యిట్లు కయ్యానికై కాలు దువ్వి
చెలరేఁగి దూఱుచు చిందులాడంగ

# మడ్డుకత

మిన్నకుండెదు నాయమే నీకు నకట!
కానివాఁడుగ నీవు కలిగించుకొనక
యూఁకొని యూరక యున్న నాసవతి
లోకువగట్టి యట్టాఁకలం బెట్టి
న న్నేచఁకుండునే నాయెమ్మెకాఁడ ?’

అని యింక యేమొ మాటాడెడులోన
ఆపెద్ద కొరవంజి కోపాన రేఁగి
పెనుసత్తివలె వచ్చి పెళ్లుపెళ్లునను
రెండుచెంపలు గొట్టి రెట్టఁ బట్టీడ్చి
పడఁ దన్ని మదిలోని పగ దీర్చుకొనియె.

అప్పు డాయెలనాఁగ, ఆయోర్మి యేమొ,
చప్పున లేచి యాసవతాలి జూసి,
‘ఓయక్క! యిటు సేయ నొప్పునే నీకు ?
నాయక్కవలె నెంచి నడచెదఁ గాక;
నేను చేసిన దేమి నీపట్ల, చెపుమ !

ఈసు నీయందు నా కిసుమంత లేదు ;
పడుచుఁదనంపు కావర మేమి లేదు ;
చక్కందనమ్మున కెక్కుడి కమ్మ !
నీకన్న చక్కన నా కేమి కలదు ?

నీవు చెప్పినయట్టి నీతులన్ నేను
నిక్కమ్ములని మున్నె నెఱ నమ్మినాను.
కాన నిత్తెమ్ములు కానట్టివానిఁ
గట్టివానిఁగ నమ్మ గరువింప సుమ్మ!
నీ కొక్కమాట నే నిదె విన్నవింతు;
తలపెట్టలే దింతదాఁక నీయూసు;
నామగం డేటికో నామీఁద నలిగె;
ఏతప్పు నావల్ల నిసుమంత లేదు;
మొఱకు లెవ్వారొ చెవి గొఱికినా రనుచు
ననుమానమున నట్లు లాడితిఁ గాని
నీమీఁదిపగచేత నే నాడలేదు;
నీమీఁద పొర పేమి నామది లేదు!
ఆమాటలకె నీకు నలు కేల వచ్చె?
ఉలు కున్నదానికే అలు కెక్కు వనుచు
సామెత విందుము జగతిలోఁ, గాన
నీవె దీనికి మూల మేమొ యటంచు
నామది గట్టిగా ననుమాన మొదవె.
అక్క, యింకొక్కమా టాలింప వమ్మ!
మగఁడు ని న్నేవగింపఁగఁ జేతు ననుచు,
నీసుగంబుల కెల్ల నే నాసచేసి

మడ్డు కత

నిన్నొల్లకుండంగ నేఁ జేతు ననుచు
లేనిపోని తలంకు లూని యున్నావు;
బ్రమ జెంది నామీఁద పగ బూనినావు;
నేను నీ కడ్డంబు నిలిచినా ననుచు
మగని నన్నెడఁబాప మది నెంచినావు;
ఎమేమి బూమెలో నామీఁద పన్ని
యేలికతలలోని కెక్కించినావు;
కాకున్న నీ కేల కలిగె రోసమ్ము?
ఇపుడు నీచేసిన యీ రట్టు చూచి
మొదలక తా నేల మిన్నకున్నాఁడు?
అక్కరో, నామీఁద నలుగఁ బోకమ్మ!
నిందెలు మోపుట నీతి గాదమ్మ!
చాడీలు చెప్పుట పాడి గాదమ్మ!
కాఁపురాలను గూల్చు గడుసుందనాలు
చేఁత లిల్లాలికి చెల్ల వోయమ్మ!
మగఁడు మక్కువతోడ మగువ నేలుటకు
మూలము బంగారుసీలమే కాని
మాటతేటలు గావు, మచ్చికల్ గావు;
వగ వద్దికలు గావు, నగవులు గావు;
గారముల్ గావు, సింగారముల్ గావు;

### మద్దు కత

సయ్యాటములు గావు, చదురులు గావు ;
వలపించుటలు గావు, వగపులు గావు.

మగనిపై మనసులో మక్కువ యున్న
మగువపై మక్కువ మగనికి నుండు.
మగనిమనస్సు చూఱగొనంగ నెంచు
మగువ నిండుమనమ్ము మగని కీవలయు.

మగని లోఁబఱచుకో మదిఁ గోరుమగువ
మగఁడు తన్నే కోర మదిఁ గోరుమగువ
తనదు మనస్సుచే, తనమంచిచేత,
తన మేలుపనులచే తన మగం డలరి
తను మెచ్చుకొనెడు రీతిని మనవలయు ;
అంతియే కాని నాయక్కరో, వినుము,
మాట తేటలచేత, మాయలచేత
మగవానిఁ దనబానిసగఁ జేసికొన్న
కలకాలమును నిల్వఁగలుగ దా వలపు.

మనసు లొక్కటియైన మక్కువే నైన,
తనువు లున్నన్నాళ్లు తరలక నిలుచు.
తలఁపునం దీమాట నిలుపు మోయమ్మ !
మాయక్క, మరియొక్క మా టాలకించు :

మడ్డుకతే

అచ్చిక బుచ్చిక లిచ్చకా లాడి
కొండెంబు లొరులపైఁ గొంకక చెప్పి
మగని మెప్పించి తా మరగించుకొనఁగఁ
దలఁచు టెంతయు వెఱ్ఱితన మాను గాని
వెలఁదికోరికి నెఱవేఱదు సుమ్మ!
నిలుకడమీఁదను నిజమెల్లఁ దెలిసి
ముగుదకున్న సుగంబు మొదటికి వచ్చు.
మంచితనముచేత, మక్కువచేత
మగవాని కైవసంబుగఁ జేసుకొన్న
మగనాలు సుగముగా మనుగడ గడపు.

ఈసున్న చెలికి సంతోసంబు సున్న.

ఈనానుడిని మది నిడుకోఁగదమ్మ!
తోడఁబుట్టువులట్ల కూడిమాడుచును,
నేస్తంబు గట్టిన నెలఁతలరీతి
కలసి మెలసి యున్న చెలులము మనము ;
కయ్యమాడుటలు చుల్కన గాదటమ్మ
పెద్దదానవు నీవు, పిన్నను నేను ;
నేను నేరనిదాన, నీవు నేర్పరివి :
నీ చెల్లెలుగ నెంచి నెనరుతోఁ జూచి

నను గారవింపవే నాతల్లి కాన!'
అని వేఁడుకొనుచున్న యంగనఁ జూచి
సవతి కావున చిన్ని పువుఁబోణిమీఁద
సవతు గానని యీసు సహజంబు గాన,
సవినయంబుగ నన్న సరసోక్తు లెల్ల
నవినయంబున నాడినట్టు లూహించి,
ఆపెద్దమొఱుకత యలుక రెట్టింప
ప్రేలంగఁజొచ్చె నోరికి వచ్చినట్లు:
'ఓసి మాయలమల్లి, దోసాలవెల్లి,
ఓసోసి వేసాల యూసరవెల్లి!
మోసాలలో నన్ను ముంపఁజూచితివా!
మొగవానిఁ దెగిమొత్తి మోసాల కేగి
మొఱఁబెట్టినట్టు నామ్రోలకు వచ్చి
వగచుచు వగచుచు వాఁతలిడ్డట్టు
నను వేఁడుకొనులాగు నటియించుచుండి
కారు లంటివి పెద్ద నేరమ్ము మోపి:
నాగోనా లెఱుఁగనినరు లెవ్వరైన
నిజమని నమ్మిన, నీచురా లనెదు
వాదు రాదే నాకు వగలాఁడికాన!
ఇటువంటి మాయ లిం కెన్ని నేర్చితివె?

మటుమాయలాఁడివో, మాటిమాటికిని
నామగం డంటి, కాఁణాచివే నీవు?
మనమగం డనరాదె? మాటమాత్రమున
మగఁడు నావాఁడుగా మాఱిపోఁగలఁడె?
పొలితి, యీమగఁడు వెంగలివాఁడు గాన
మాయమాటలచేత మన సుబ్బఁజేసి
కరగించి మరగించి మురియుచున్నావు.
మగవాఁడు గడుసరిమనసువాఁ డైన
గడిదైన నీ నాటకము సాఁగఁగలదె?
ఏనాఁటికైన నీ యీబూటకములు
తేటతెల్లమ్ముగాఁ దెలిసి యేలికకు
వెగటు పుట్టెడునట్టి వేళ రాకున్నె?
ఈలాగు పెద్ద ప్రోయాలాడినట్టి
మాటలలో పోటుమాటలు కొన్ని
మగనిడెందమునకు తగిలినట్లయ్యె.'
సింగనిమదిలోను చిరమరల్ పుట్ట,
కాంతాళమున పెద్దకామిని మున్ను
చిన్న చేడియమీఁద చెప్పినయట్టి
కొండెముల్ నమ్మి యాకోమలిమీఁద
నేవగొన్నకతాన నెఱుకు కన్నాకు

చీకాకుపడినట్టి చిత్తంబుతోడ
తా కాఁకపడి చిన్న తనివి కిట్లనియె:

'ఓసి దోసి, పిసాసి, ఓసి రాకాసి!
ఇంతగందరగోళ మేల పెంచితివె?
ఏమి చెప్పితినె నే నిందాఁక నీకు?
పాటిసేయవు నాదు మాట సుంతైన:
నను లెక్కచేయకున్నా వెంతపొగరె!
నెలపేది కెక్కి నన్నే చూడుఁ డనుచు
గంతులు వేతురే గతిలే లెందైన?
ఇల్లాలి లంజన్న నిలు దూఱు నంద్రు;
ఇల్లాల వౌదువే? యిటు రజ్జులాఁడి,
మగవాని నమ్మించి మనఁజూతు వహహా!
నీమాయలకు లొంగి నినుఁ గూడి మరల
సరివారు నవ్వ కాఁపురము సేయంగ
చేలనే? యీహటం చేలనే? యూస
లేలనే? యడియూస లేలనే? యింక
నేలనే నిన్ను; నీ వెందైనఁ బొమ్ము.
పొమ్ము పొ మ్మింక నీపోకిళ్లు మాని.
పోకున్న సైరింపఁబో నింక నిన్ను.'

అని యిట్టు లెఱుఁగువాఁ డాగ్రహం బడర,
గండఁడై ఖండసగా నాడినట్టి
యాపల్కు లాలించి యాముద్దరాలు
గుండె తల్లడ మంద గొయ్యామైపోయె ;
కడఁబట్టి ప్రాణంబు పుడమిపై వాలె.
అది చూచి ప్రజలెల్ల హాహా! యటంచు,
ఇల్లాలిదురవస్థ కెద జాలిపడుచు,
'అయ్యయో ! మూర్ఛిల్లె నాబాల చేల,
చల్లరే చన్నీళ్లు చామమోమునను !
మెల్లన విసరరే మెలఁతుక ' కనుచు
చెలువ లాకోమలి సేద దేఱంగ
చేరి చల్లనిసేవ చేసి రావేళ.

తత్తరంబునఁ జూచె దాని నాసవతి.
ఉత్తలంపడి చూచుచుండెను మగఁడు.

ఎలనాఁగ యంతలోపల మూర్ఛ దేరి
రెండుచేతులు మోడ్చి రివ్వున నరిగి,
విడిచిన పువ్వుతో విలసిల్లు ననఁటి
పెనుగాలిచే పుడమిని గూలినట్టు,
ఎఱుకుపాదాలపై నొరగి యొగ్గెత్తి

గందుకోయిలభంగిగా నేడ్వఁదొడఁగె.
'ఓదొరా, సవతితో వాదేల నాకు?
నెనరు చూపినఁ జాలు నీవు నామీఁద;
కనికరించినఁ జాలు కాసంత నీవు;
జాలిఁ జూపుము, పది వే ల దేచాలు:
నీమేలు నామీఁద నిరుకుగా నున్న
సవతిజో లేల, మోసంత నా కేల?
సరకుసేయనుసుమీ జగ మేమి యైన?
"సైఁపుతో నీతప్పు సైరించినాఁడ"
నని యొక్కమాట నీ వాడవే సకుఁడ!'
అనుచు మోమున దైన్య మతిశయిల్లంగ,
వినువారిమనసుల పెనుజాలి గొలుప,
కొసరి పల్కెడు వేఁడుకోలు పల్కులకు
మాఱుమాటాడంగ నేర కామెఱుకు
కనుచుండె బొమ్మయై కను లప్పగించి.
'పలుకవా! పలుకవా! పన్నీరుమొలక!
అలుక చాలింపవా, అపరంజిచిలుక!
రచ్చించవా నన్ను, రతనాలపలక!
నాకు దేవర వైన నీదుముంగలను
పాదాలు ముట్టి నే బాసచేసెదను;

మద్దుకత

ఒట్టిడుకొందు, నీ వాక్కింత తాళి
నాసత్తెమును జూడు నాదైవరాయ!
బెబ్బులిమీసాలు పెనవేసి యీత్తు;
తాఁకెద నలిగిన తాఁచుకోరలను;
కడలిఁ జొచ్చెద, నగ్గి వెడలివచ్చెదను:
నమ్మిక యిప్పింతు నా బైలుచేత;
సాకిరులుగఁ జేతు నా కోటిసురల ;
ఈపంటవలఁతిచే నిప్పుడె పల్కింతు.
నెలను దూలింతు, ఱిక్కలను రాలింతు;
విటతాటపఱుతు రేవెల్లు, వేవెల్లు.
నమ్మవా, నమ్మవా, నాముద్దుమామ?
కనవ, నాకనుచెందొగలచందమామ!
చూడవా, నాసుద్దిసుద్దిచందంబు?
వీడవా, యెద నాటి వేఁచు చిందంబు?
మానవా, నామీఁద మదిగొన్న చలము?
పూనవా, నన్నేముబుద్ధి నిచ్చలము?
నాదుకందనగాయ, నాజీవగఱ్ఱ,
వలపులకోవ, నాతలుపులతీవ!
నీక్రేవ నన్ను రానీవటే’ యనుచు,
‘కొసరక నన్నేలుకోవటే’ యనుచు,

## మడ్డుకత

పలుపలువిధముల భయభక్తు లడర
బతిమాలు బామాలు భామను చూచి,
చేడియపల్కు లచ్చెరు వొందఁజేయ,
కరఁగి యుల్లంబు లక్కటికంబు గురియ,
ఎఱుకుమోరకుఁదనం బేవ పుట్టింప,
ప్రజలు భావోద్రేకపరవశు లగుచు,
'ఓరోరి మూర్ఖుఁడా, ఓకిరాతకుఁడ,
ఓరోరి ధూర్తుఁడా, ఓరిఘాతుకుఁడ?
ఏమిరా యీపంత మీయింతిమీఁద?
ఏలరా యీచలం బీబాలమీఁద?

చాలురా చాలురా సాదు వాదువులె!
చాల్చాలు పోపోర చపలచిత్తుండ!
పక్షపాతంబు కన్పడుచున్న దార!
వలపక్షమల పెద్దభార్యపై నీకు
గాటమై నాటినకరణిఁ గన్పడియె;
న్యాయంబు గాదు; నీనడవడి యెల్ల
లోకుల కీవేళ రోఁత పుట్టించె.

వనిత యెంతటి పతివ్రతయొ కాకున్న
శపథంబు లాడునే సత్యంబు దెలుప?

## మద్దుకత

శీలసంపదయొప్పు బాల గాఁబోలు,
ఏడిపింపకురోరి, యిక్కట్లు వచ్చు.
గత్తితల తలకట్టు గాసిఁ బెట్టెదవు;
కొాల చుట్టుకొాను నూరకున్న మా కెల్ల.
ఒక్క పరీక్ష యీాయువిదచేఁ దెలిసి
సుదతి నీ వేలుట శుభమాాను నీకు.'
అని యొక్కపెట్టున నందఱు నాడ
ఎట్టకేలకు దాని కీకొాన వాఁడు.
అప్పు డాయతివ దిగ్గన లేచి నిల్చి,
ప్రజ లెల్లరిని జూచి ప్రాంజలి పట్టి,
'ఏకిమీాఁద, నేఁడు మీరెల్లరుఁ జూడ,
ఎల్లవేల్పులుఁ జూడ, నేదోస మెఱుఁగ
నేను నిక్కమటంచు నీకునుంగలను
మద్దు దీసెదను, నామైమ గన్గొానుము;
తీయునో నాయక్క, తేఁకువన్ గనుము'
అని ఖండితమ్ముగా నాడినయట్టి
శపథంబు విని, గుండె జలదరింపంగ,
ఆపెద్దమెఱుకత యేపెల్ల నణఁగ,
కుక్కిన పేనయ్యె గ్రుక్కుమిక్కనక.
'నలుగురిలోపల నగుబాటు లయ్యె;

## మడ్డు కత

మడ్డు దీయుటయంచు మాయ నాసవతి
గడ్డుపరీచ్ఛ యెక్కడ దాపరించె!
మడ్డు దీయు టనంగ మాటలా యేమి ?
ఆసుద్ది కెంతయిల్లాలు గావలయు?
నావంటియొకపాటినాతికిఁ దరమె ?
పదిమంది తన్ను శాబాసందు రనుచు
పగ్గ లగ్గలముగా పలికెనే కాని,
తలఁగక తాఁ దీయఁగలుగునే మడ్డు?
తీయునో యేమొ బల్ తెరవాలుకత్తె,
మటుమాయలాఁడి, తా మందులు మాఁకు
లెన్ని నేర్చినదో? లేకున్న నేఁ డిట్లు
పతినలు పట్టునే ప్రజ యాలకింప ?
తన కవమానంబు తప్పదో' యనుచు
నబల గుండెలు గుబగుబలాడ నుండె.
ఎఱుకఁ డాపలుకుల కెద తొట్రుపడఁగ
నేర కేమియు నట్టె నిలువడిపోయె.
అప్పు డాప్రజలలో నాయన్ను మిన్న
కలఁగక పలికినపలుకులం గూర్చి
మానిసి కొక్కొక్కమాటగా నాడ
కలకలం బుదయించె గంద్రగోళముగ.

ఇట్టి సందడిలోన నెల్లరి చూడ్కి
ఆచిన్ని జోగిణినే చేరియుండె.
అది యంత పెదవిని గదపినన్తైన
నిశ్శబ్ద మైపోయె నిఖిలంబు నచట.
'చెలువుఁడా, నేఁడు బోసేసియున్నాను ;
నిట్రుపాసముతోడ, నేమమ్ముతోడ ;
సత్తెంబు సూపుట క్రొత్తడి తగవు ;
ఎల్లిఁ బూనెదఁ గాక యీకర్జమునకు,
సెల వీవె నేఁటికి చెంగనా లిదుదు.'
అనుపల్కు లాలించి యట నెల్లవారు
ఔదల లూఁగించి రౌఁగాక యనుచు.
ఎఱుకువాఁ డోడఁబడె నీచందమునకు ;
ప్రజలెల్ల సంతోసపడిరి డెందముల ;
నెవరిదారిని వార లిండ్లకు చనిరి.
మద్దు దీసెదు వింతమాట యూరెల్ల
నానోట నానోట నపుడె వ్యాపించె.
అబ్బురంపువిశేష మైనకతాన
ఆచుట్టుపట్టులయం దున్నయట్టి
పల్లెలు పట్ణాలు ప్రాఁకె నవ్వార్త.
ఆశీలవతి యట్టు లగచాట్లుపడుట

చూడఁజాలఁగలేక సురలతోఁ జెప్పి
తోడ్తెచ్చి యామెకుఁ దోడుపడంగఁ
బూని యేఁగెనొ నాఁగ భానుండు చనియె.
నిర్దోషురాలైన నెలఁతుకమీఁద
చెడునింద మోపిన చెనఁటిపై ప్రకృతి
కినిసెనో యన సంజకెంజాయ లొలసె.
మచ్చరించినయట్టి మదవతిబుద్ధి
అంధకారనిమగ్న మగుసన్నరీతి
నిబిడాంధకారంబు నిండె లోకమున.
ఇరువురాంధ్రకు మధ్య నిఱుకులోఁబడ్డ
పురుషులు మతిమాలి వెరవులు మాలి
యలయుచు కొట్టునిట్టాడుకై వడిని
కటికిచీఁకటిలోను కను గానరాక
ప్రాణికోటులు పాట్లుపడుచుండె మిగుల.
లోకయాత్రను చేయు లోకుల కెలమి
బాసటపడు పుణ్యాపరుల తీరునను
జీవయాత్రికుల కాచీఁకటిలోన
దీపికల్ జగమెల్ల జూపుచునుండె.
సవతిపై సొద్దుగా సాహసం బడర,
తెల్లవారఁగ మద్దు దీతు ; నామగని

## మ డ్డు క త

మనసు మెప్పింతు ; నామగఁ డెల్లి నన్ను
కైకొను నేకుందుకందులు లేక ;
సరివారిలో నే మసలఁ గందు ననుచు
చిన్ని యీ మెఱుకత చిత్తాంబుజమున
జనియించుచున్న యాశాజ్యోతు లనఁగ
మెఱసె చుక్కలు మింట మినుమినుక్కనుచు.

ఈలువు గలిగిన యిల్లాలిమీఁద
పట్టరాని యసూయ పడి నిందె గట్టి
నట్టియాకట్టిడి మిట్టిపా టెల్ల
ననతికాలంబులోననె మచ్చమణఁగుఁ
గద యన్నపగిది లోకము మాటుమణఁగె.

నేరముల్ చేసిన నీచులు తమిని
జడియుచు నిసివేళ చరియించుకరణి
గూబలు వెలువడె గూళ్లలోనుండి.

కాలమన్ మైదెఱుకలవాఁడు చెలఁగి
నిలువున తెలివిసొమ్ములు దోఁచుకొనఁగ
నిఖిలజీవులమీఁద నిదురమత్తెనెడు
మచ్చుమందును జల్లి మైకమ్ము గొలిపె.

గరితలమిన్నయా నెఱుకతమీఁద
కటికికల్లలు చాల కల్పించి చెప్పి

యపవాదు పుట్టించినట్టి తొయ్యాలికి
తలవంపులగు నేఁడు, తప్పదటంచు
గట్టిగా నొక్కి వక్కాణించునట్లు
కోళ్లు మువ్వురుసలన్ గూసె గొంతెత్తి.
తెలవారుమును మద్దు తిరునాళ్లు చూడ
పల్లెపల్లెలనుండి పైనమై వచ్చు
ప్రజకు మార్గముఁ జూప ప్రాగ్దిశారమణి
కడఁగి పట్టిన దొడ్డకరదీప మనఁగ
వెలిఁగె తూరుపుచుక్క వేగురుచుక్క.
క్రొత్తడి మిన్నలన్ గూర్చిన కథలు
సత్తాలు మహిమలు శాపాలు శాస్త్ర
లద్భుతకార్యంబు లక్కజం బొదవ
పెద్దలచే విన్న పెక్కు చందములు
కుతుకంబుతో చెప్పుకొనుచు నేతెంచు
ప్రజలకంఠధ్వనుల్ పక్షులధ్వనులు
కలసి యూయూరెల్ల కలకలం బయ్యె.
వీఁకమై లోకంబు చీకాకుపఱిచి
యేఁచు చీఁకటి సోఁకు నేపు మాపంగఁ
దలఁచిన లోకబాంధవుఁడైన యినుని
చండప్రతాప తేజఃపుంజ మనఁగ

నరుణకాంతులు పర్వె నాకాశవీధి.
దినరాజు విడిచిన దివ్యమయూఖ
బాణపరంపరబాధల కోడి
చీఁకటిరాకాసి కాకులై వచ్చి
కావుకావు మటంచు కమలబాంధవుని
పాడుచు దిశలకు పఱచుచందమున
కావుకావుమటంచు కాకులు వెడలె.
తనబ్రతు కేమౌనో, తన గతేమవునో
యని గుండె తటతటలాడంగ నున్న
చాడీలమెఱుకలసానిమో మట్లు
కలువకన్నె మొగంబు గ్రక్కున మొగిడె.
తనదుశ్శీలముపట్ల, తనచిత్తశుద్ధి
పట్లను, తనదైన పతిభక్తిపట్ల
గట్టినమ్మిక గల్గి గ్రాలెడుకతన
ధైర్యంబు స్థైర్యంబు దనరిన దగుట
గరితయాస్యము కలకలలాడునట్లు
పద్మిని వికసించి ప్రభచే రహించె.
నిఖిలదేవతలను నెమ్మిఁ దోడ్తెచ్చి
కనరానిగతి నిల్పి గగనభాగమున
మహనీయమగు సాధ్వీమహిమాతిశయము

కడుసడ్డతో వేయికన్నులన్ జూడ
నింగిపై పొడవెక్కి నిలిచెనో యనఁగ
ప్రభవించె శ్రీసూర్యభగవానుఁ డప్పుడు.
అటమున్నె వేకువ నరుణోదయంబు
గాకుండ లేచి యా గరితలమిన్న
చెఱువులో స్నానంబు చేసి యేతెంచె ;
గ్రామదేవతగుడికడ నొక్కయెడను
గోమయంబున శుద్ధి గొనకొని చేసి
బాగుమీఱఁగ రంగవల్లికల్ తీర్చి
పద్మాసనస్థ యై పడఁతి కూర్చుండి,
హృదయేశ్వరునిఁ గూర్చి,యిలువేల్పుఁగూర్చి
సరిలేని నిష్ఠతో జపము గావించి,
పిడుకలతో దాలి పేర్చి యొక్కెడను
నిప్పు ముట్టించి నూనియ నించినట్టి
బాణలి నొకదాని దానిపైఁ బెట్టి,
అగ్గి రగులుకొల్పి అత్యుత్సుకమున
ధ్యానంబులో మున్గి తా నుండె నంత ;
పౌరు లందఱు కూడి వచ్చి రచ్చటికి ;
పల్లెపల్లెలనుండి ప్రజలెల్ల దిగిరి ;
పట్టణంబుల వేల ప్రజ వచ్చిపడిరి ;

నరసముద్రం బయ్యే నాఁ డాస్థలంబు:
పతివత్నియుత్సాహాభరము రెట్టించె.
జపము చాలించి యా సతివతంసంబు
పతిని సమీపించి వలగొని వచ్చి
సాష్టాంగముగ నమస్కారంబు చేసి
బత్తితో పతిదేవు పాదాంబుజములు
కడిగి పూజించి తా కనుల నద్దుకొని
పువ్వులు కుంకుములతో పూజ కావించి
పాదోదకము తల పైని చల్లుకొని
బత్తి నా తీర్థంబు పానంబు చేసి,
అలికాన కుంకుమతిలకంబు దిద్ది
వేణిలో నాపూలు వెలయుంగఁ దాల్చి,
గుడిలోపలికి పోయి కుదురైన బత్తి
గ్రామదేవత మ్రొక్కి ప్రార్థించి వచ్చి,
సూర్యదేవునిమీఁద చూపు నిగిడ్చి
ప్రార్థన గావించి పదపడి వచ్చి,
'సెలవా' యనుచు తన చెలువుని వేఁడి,
పతి వేలి నిడుకొన్న బంగారు బటువు

కోరి పుచ్చుకొని తా కుతుకంబు మీఱ
బాణలిలో వేసి 'బాల చేతులకు
పసరు రాచిన దేమొ పరికించినావె'
అనియెడు ననుమాన మెనయకయుండ,
కుంకుడుపులుసుతో గోళ్లు సైతముగ
చేతులు శుభ్రంబుగా తోమి కడిగి,
అగ్గిబాణలిచెంత కల్లన వచ్చి,
ముమ్మారు లగ్ని నిమ్మగఁ జుట్టివచ్చి,
సర్వదేవతల నిశ్చలమానసమున
స్మరియించి, పతిని నెమ్మనమున నిల్పి,
చూపఱ వెఱఁగంద, సురలు హర్షింప,
మందహాసము మోము నందగింపంగ,
సలసల మసలెడు చమురులోపలను
మంచిగందపునీట ముంచినయట్లు
చెయి ముంచి తీసె నచ్చెలువుంగరము.
కన్నె చేఁజిగురాకు కసుగందలేదు :
బాల తా మిసిమింతురాలు కాలేదు ;
మోము విన్నఁదనంబు గీము కాలేదు ;
పున్నమనెలవోలె పొలఁతుక వెలిఁగె
ఈవింత చూడఁగా నేతెంచినట్టి

ప్రజలెల్ల 'రిది మహాపతిభక్తురాలు,
సాటి గానని తపస్సంపన్నురాలు,
సీతకే చెల్లె, సీ నాతికే చెల్లె
అనలుని చలువచందనముగాఁ జేయ ;
అహహా, యీ యిల్లాలి మహిమాతిశయము
వర్ణింప వశమౌనె వాణికి నైన?—'
అని యిట్లు కొనియాడి యానంద మలర
చేతులు జోడించి జోత లొనర్చి
జేజేధ్వనులు చేసి సేసలు చల్లి
నెలపచ్చకపురంబు నివ్వాళు లిచ్చి
భక్తితత్పరతలు ప్రకటించి రపుడు.
అవింత చూడంగ నట నిల్చియున్న
నాలితనాల కన్నాకయి యున్న
మొలుకత యొడలెల్ల చురుకున మండె.
అగ్గి యంటిన దంచు బెగ్గిల్లి మొలుకు
పొలఁతుక యొడలెల్ల కలయంగఁ జూడ
నింగిపై చుక్కలు నిండుకొన్నట్లు
కొమ్మ నెమ్మేన పొక్కులు నిండుకొనియె.
అవి యెట్టివో కాని యాపొక్కు లెల్ల
బగబగలాడుచు బాధింపఁ దొడఁగె.

మ డ్డు క థ

ఆ బాధ పడలేక యామెూండికట్టె
ఎలుఁ గెత్తి గొల్లున నేడువసాగె.
ఇది యేమెూ యని చూచి యెల్లరు నగిరి.
తన మేనిమంటల ఘనబాధకన్న,
జనులెల్ల తన్ను నవ్విన బాధ కన్న,
తనసూడు సవతి చూపిన మేటిమహిమ
తనమనం బెరియింపఁ దలకొన్న బాధ,
సవతి నెల్లరు మహాసాధ్వి యటంచు
పొగడి వేల్పులకైన పొందఁగా రాని
గౌరవంబును జేయఁ గనులారఁ గన్న
బాధ యత్యధికమై పరితాప మొదవె.
ఆ యెలుకలసాని కాయంబునిండ
నెలయు పొక్కుల కేమి హేతువో యనుచు
చర్చింప సాగె నాజనసంఘ మెల్ల.
'శాప మిచ్చిన దేమెూ సాధ్వి తా' ననుచు,
'సాదు లుస్సురుమన్న పో దూర' కనుచు,
'మంత్రించెనే మెూయామహామాధ్వ'యనుచు,
ఎదలఁ దోఁచినయట్లు లెల్ల వాకొనిరి.
'మసలెడు నూనియ మడ్డులోనుండి
సవతిసూడును దీర్ప సమకట్టి చెంత

నిలిచి చూచెనుదాని నెమ్మోని నిండ
చిలుకు వేసినభంగి చెలి నూనెచేయి
చిలుకరింపఁగఁబోలు చేరి కన్గొనుఁడు:
చమురుపొక్కులె అవ్వి, సందేహ మేల ?’
అని నిశ్చయముచేసి రట కొంతమంది.
జరిగినకథయెల్ల నరయుచున్న
మెఱుకు ఖేదము మోద మెదలోన నిండ
చిన్న యిల్లాలిని జేరఁగాఁ బోయి
తెఱవ యుంగరమును దీసినవేళ
తోరంపుబత్తితో దోసిలి యొగ్గి,
‘చెలువ, నీసత్తువ తెలుసుకో లేక,
వెలఁది, నీసీలంబు తెలుసుకోలేక,
చెలియ, నీయీలువు దెలియఁగాలేక,
తెఱవ, నీడెందంబు తెలియఁగాలేక,
కలికి, నీచందంబు గానఁగాలేక,
చాన, నీదుసబాము గానఁగాలేక,
పెద్దాలిసుద్దులే పెద్దగా నమ్మి
నిన్ను కారులు కూసి చిన్నపుచ్చితిని ;
ఎల్లిదం బొనరించి యేడిపించితిని ;
ఎగ్గుతగ్గుల నాడి సిగ్గుపర్చితిని;

సవతిచే ముత్తించి చౌకచేసితిని:
నన్ను మన్నింపవే నాముద్దుగుమ్మ!
నన్ను సైరింపవే నాముద్దరాల!
నీవు నాయింతివై నెగడుటచేత,
నీవు నానెలఁతవై నిలుచుటచేత,
పున్నమ్మ గంటినే పున్నెంపురాసి!
బాగ్గెంబు గంటినే బాగ్గెంపుబరణి!
నాకొలంబు తరించెనే కొమ్మమిన్న!'
అని బుజ్జగించి హార్షాబ్ధిలోఁ దేల్చి,
పెద్దభార్యను జూచి తద్ద నిందించి,
'మేతప్పు నెఱుఁగని మెలనాఁగమీఁద
వాతప్పు పుట్టించి గాత చేసితివి;
నన్ను నీమాయచే నమ్మించివేసి
ఆడించితివి కోఁతి నాడించినట్లు;
చేయించితివి సీదు చిత్తమౌ పనులు;
రక్కసతనములో రగడ దేరితివి;
వేరముల్ పెంపఁగా నారి తేరితివి;
కొంపలు గాల్చు బల్ కొరివివైనావు;
కాఁపురాల్ గూల్చు బల్ కఱటివైనావు;
ఛీ, పోవె, పలుగాకి! ఛీ మాలకాకి!

మ ద్దు క త

మేలు వచ్చెను, చాలుచాలు నీసొంపు;
నలుగురిలో నేఁడు నగుబాటు లయ్యె:
చెనఁటి, నీ మొగము చూచిన పాప మొదవు;
నే నేల నోళ్ల నిన్నిఁక, లేచిపోవె—'
అని యాగయాళిగంపను బారఁద్రోలి
చిన్నయిల్లాలితో చేసె కాఁపురము;
సౌభాగ్యపదవితో సంపదతోడ
సంతతితో సర్వసౌఖ్యాలతోడ
నిత్యసంతోషాన నిరుపమానముగ
నెలుకుఱ్ఱొత్తడిమిన్న నెఱపె జీవితము.
జాతి మైదెరుకలజాతి దీనాతి;
చదువు సంపద లేనిజాతి దీనాతి;
శాస్త్రవాసన లేని జాతి దీనాతి;
జగతి సభ్యత లేని జాతి దీనాతి;
యేజాతి దైన హిందూజాతినాతి
యీనాతి కాన హిందూనాతిపట్ల
సహజమై విలసిల్లు మహనీయమైన
మహిమకు కొదవ యేమాత్రమున్ లేదు.
అది గాక యొక్కసత్యముగూడఁ గలదు:
చదువున కర్థంబు జ్ఞానంబు గాని

చదువైన యక్షరజ్ఞానంబు గాదు.
వివిధధర్మవివేకవిభవంబు లేని
చదువుట వ్రాయుట జ్ఞాన మెట్లగును ?
చదువు వ్రాయుట జ్ఞానమే యైన
చదువరు లేల యజ్ఞాను లైనారు ?
చదువనివా రేల జ్ఞాను లైనారు ?
జనుల సద్వర్తనసంపత్తికెల్ల
జ్ఞానానుభవమే ప్రధానమై యుండ,
జనులకు జ్ఞానంబు సహజమై యుండ,
చదువుతో పని యేమి సద్గుణంబులకు !
సాహితిపని యేమి సౌశీల్యములకు ?
శాస్త్రాలపని యేమి సద్వర్తనలకు ?
చదువు సాహితి శాస్త్రసంపత్తి లేని
జాతులలో శీలసంపత్తి గలదు;
నిరుపమానంబైన నెఱనీతి గలదు;
గణనీయమైన యోగ్యతకూడఁ గలదు;
తగవు ధర్మము సంప్రదాయాలు గలవు:
ప్రతి చూపఁగారాని పతిభక్తి గలదు ;
మాద్రి చెప్పఁగరాని మహిమంబు గలదు.

## ముద్దుకత

దేశదిమ్మరులైన తెగలలోఁగూడ
ప్రాణప్రదంబైన పతితోడ దివికి
సహగమించిన మహాసాధ్వు లున్నారు.
మానభంగము సిద్ధమైన వేళలను
ప్రాణాలు విడిచినపడఁతు లున్నారు.
మగఁడు తె మ్మనుమానమతిఁ గన్నపట్ల
ఘనపరీక్షల నిగ్గ గరితె లున్నారు.
కులముతక్కువవారు కుమతులు కారు;
కులముతక్కువవారు కులటలు గారు;
నిమ్నజాతులవారు నీచులు కారు.
కొలముతక్కువ దైన కులకాంతలందు
గుణ మున్నదనుట కీ క్రొత్తడి సాక్షి.
సాక్షు లున్నారింక శతసహస్రములు:
జాతులలో నిమ్నజాతిలో పుట్టి
పరమపతివ్రతాపట్టంబు గట్టి
రమణీమణులకెల్ల రాణి యైనట్టి
నాతి ఆరంజోతి జోతి గాలేదె?
ఆనాటిమిన్న దివ్యయశస్సుభాతి
నీనాటిమిన్న విశ్వేద్యవిఖ్యాతి
యాచంద్రతారార్క మలరారుఁగాక!

'నిరవద్యపురమను నిడుదవోలునకు
మిగుల చెంగట రావిమెట్టగ్రామమున
డెబ్బదియేళ్ళనాఁ డీవింత గంటి,
నని బొమ్మగంటి లచ్చయ శాస్త్రి తెలుప,
క్రొత్తడిచరిత వ్రాసెన పున్నె మనుచు,
నిమ్నజాతులలోని నెలఁతలనీతి
యెల్లవారికి తేట తెల్లమౌననుచు,
విరచించినాఁడు మం. వేంకటశర్మ.

—

# జాతీయగ్రంథరత్నములు

---

| | వెల రు. | అ. | పై. |
|---|---|---|---|
| భీష్మునిచరిత్రము (గద్యపద్యాత్మకము) | ౦ | ౧౨ | ౦ |
| సహకారవిజయము (సాంఘికనాటకము) | ౦ | ౧౨ | ౦ |
| వీరమతి నాటకము (నవరసభరితము) | ౦ | ౧౨ | ౦ |
| చమత్కారచంద్రిక (శృంగార, హాస్య, చమత్కార వినోద పద్యములు) | ౦ | ౮ | ౦ |
| ఆనంద చంద్రిక (శృంగార, హాస్య, చమత్కార వినోద పద్యములు) | ౦ | ౮ | ౦ |
| నిరుద్ధభారతము – హరిజనసమస్య (పద్యకావ్యము) | ౦ | ౬ | ౦ |
| బాలవితంతువిలాపము (జాలిపద్యములు) | ౦ | ౬ | ౦ |
| సాధుసంజీవనము (భక్తిరసభరితములగు ప్రార్థన పద్యములు) | ౦ | ౬ | ౦ |
| కోయిలపాటలు (భావభరితములగు మధుర గీతములు) | ౦ | ౬ | ౦ |
| శ్రీరామశతకము (లఘుటీకతో) | ౦ | 3 | ౦ |
| భక్తవత్సలశతకము | ౦ | ౨ | ౦ |


మం. వేంకటశర్మగారు.

నిడదవోలు, ప. గోదావరి.



శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రింపఁబడి, మంగిపూడి వేంకటశర్మగారిచే ప్రచురింపఁబడియె 30—1936.